# బిల్లీ బాబు

# చేశాడు అద్భుతం





## అబ్బుర పరిచాడు

“బిల్లీ బాబు, చూడు నీ గది!

తెచ్చాను చీపిరి కొత్తది!

నీ గది అంతా తుడిచేస్తాను,

ఈ చెత్త అంతా పారేస్తాను.”



“అమ్మా, ఇక్కడ చెత్త కాదు ఏదీ
ఈ సొత్తు అంతా నాదే నాది.
నువ్వూ వద్దు, నీ చీపిరి వద్దు
ఇక్కడివన్నీ నాకు ఎంతో ముద్దు.”

“ఏదీ చెత్త కాదంటావా?
ఇది కూడా పారెయ్యనివ్వవా?”





"అమ్మా, అమ్మా! అలా అనవద్దు
దీనిని నువ్వు పారెయ్య వద్దు.
ఇక్కడ ఉన్నవి అన్నీ నావి,
నేను చేస్తున్న దానికి కావాలి అవి."



"ఇది ఏమిటి? అది ఏమిటి?
వీటిని పారేస్తే ఏంటి?"





“అమ్మా! నువ్వు నా మాట వినాలి!
నాకు అది కావాలి, ఇదీ కావాలి.
వీటన్నిటితో నేను-
ఏం చేస్తున్నానో అప్పుడే చెప్పను.
తీసుకుని వెళ్లు నీ చీపిరి కొత్తది
శుభ్రం చెయ్యవద్దు నా గది.”





"అమ్మా! నువ్వు బయటకు దయచెయ్యి!
అవీ, ఇవీ ఇక్కడే ఉండనియ్యి!"

"అయితే, ఏమిటి ఇవి?
ఏమిటి అవి?
వెంటనే పారెయ్యాల్సినవి!"

“సరే, సరే! సరే, సరే!
ఈ ఒక్కటీ ఎందుకో
పారెయ్యాల్సిందే, ఒప్పుకో.”





“వద్దు అమ్మా! వద్దు, వద్దు!
కావాలి ఆ ఒక్కటి.
పారేస్తాను అంటావేమిటి.
ఇక్కడి వస్తువులన్నీ నావి,
నేను చేస్తున్నదానికి కావాలవి.
దేనిని పారేస్తానన్నా ఒప్పను,
నేను చేసేది ఏమిటో చెప్పను.”

“ఇదేం బాగా లేదు, బిల్లీ

కావాలంటున్నావు ప్రతిదీ.

ఏది అడిగినా వద్దు అమ్మా అంటావు –

ఈ చెత్తనంతా ఎలా ఉపయోగిస్తావు?”



“దీనిని పైరెయ్యవచ్చు తప్పకుండా.”

“వద్దు అమ్మా! నా వస్తువు కాదు అది లేకుండా!”





“నువ్వు ఇక్కడ చూసే ప్రతిదీ,

నాకు చాలా చాలా విలువైనది.

నువ్వు వెళ్లు, తీసుకెళ్లు నీ చీపిరి

తీసుకోనివ్వు నన్ను ఊపిరి.”



"ఈ ఒక్కటైనా తీసుకెళ్లనివ్వు,
ఇంతైనా శుభ్రం చెయ్యనివ్వు."





"అమ్మా, నీకు కొంచెం కూడా అర్థం కాదు,
అది ఎంత విలువైనదో నీకు తెలియదు.
నేను చేయబోతున్నది ఒకటి ఉంది,
ఇది లేకుండా పూర్తి కాదది."





“సరే అయితే, ఏం చేస్తున్నావో చెప్పు,
దాని గుట్టు ఏమిటో ఇప్పుడే విప్పు.”

“నేను చేస్తున్నది ఏదో ఉంది,
నీకు కానుకగా ఇవ్వాలి అది.”

“ఏమి చేస్తున్నానా? అది ఇప్పుడే చెప్పను.
ఆ గుట్టు ఏమిటో చచ్చినా విప్పను.
దయచేసి నువ్వు ముందు వెళ్లు బయటకి,
నేను పిలిచినప్పుడు వద్దువు లోపలికి.
అప్పుడు అంతా నీకే అర్థమవుతుంది,
చేసింది చూస్తే ఆశ్చర్యం కలుగుతుంది.”

ఇప్పుడు రావచ్చు,
అమ్మా!





“బిల్లీ బాబు, నీ చేతిలో వంటల పుస్తకం
ఏమిటి నువ్వు చెయ్యబోయే కొత్త వంటకం!”




“అమ్మా! కొంచెం సేపు ఓపిక పట్టు.
నీకు ఒక అద్భుతుం తినిపిస్తాను, ఒట్టు.
ఈ పుస్తకం అంతా చదివేస్తాను,
నీ పుట్టిన రోజుకి మంచి కేక్ చేస్తాను.”
“నా కోసం కేక్ చేస్తావా?
ఎప్పుడైనా అది నువ్వు చేశావా?
నీకు చెయ్యటం రాదు కేకు,
పిచ్చి పనులకు పూనుకోకు.”

"నాపై ఉంచు భరోసా! ఒక అవకాశం ఇవ్వు.
ఈ పుస్తకంలో అంతా వివరంగా ఉంది.
అమ్మా! ముందైతే బయటకు వెళ్లు నువ్వు.
నేను చేసింది నీకు తప్పకుండా నచ్చుతుంది!"






పుస్తకం చెబుతోంది మూడు కోడి గుడ్లు.
నాది పెద్ద కేకు కాబట్టి కావాలి ఇరవై గుడ్లు!





వెయ్యాలి కొంచెం ఇది,

మరికొంచెం అది.




లేదు! లేదు!

అందులో పిల్లిని వెయ్యగూడదు!



ఫుస్తకంలో "పాలు" అని ఉంది.

నాకు అవి చాలా కలపాలని ఉంది,

అమ్మకి చాయ్ ఎంతో నచ్చుతోంది,

టీపొడి అందుకే కలుస్తోంది.

అమ్మ మెచ్చుకునేలా చేస్తాను,

ఆమెకి ఇష్టమైనవన్నీ వేస్తాను.

అమ్మకి తీపి ప్రీతిరా,

వేసెయ్ దండిగా చెక్కెరా.





జామ్ అమ్మకి ఇష్టమని మరిచా,
ఇప్పుడే ఒక సీసా కలిపా.



అమ్మకు మాంసం పసందు,
దీంతో అవుతుంది భలే విందు.

బేకింగ్ సోడా తప్పనిసరి.

డబ్బా అంతా ఖాళీ మరి.







నువ్వు దూరంగా ఉండు పిల్లీ!

ఈ పిండిలో కలవకు తల్లీ!

నువ్వంటే నాకు ఎంతో ఇష్టం,

కానీ కేకులో కలిస్తే చాలా కష్టం!




అంతే ఉంది వంటల పుస్తకంలో,
దానినిక పక్కన పెట్టేయ్.
అమ్మకి ఇష్టమైనవి లేవు అందులో,
ధైర్యం చేసి అన్నీ కలిపేయ్!




అమ్మకి ఇష్టం పచ్చడి కారాలు,
ఆమెకు ఇష్టం కరకర పేలాలు!
మరి ఇది ఏమిటి?
జిగురు! కలపను ఇది ఒకటి!



చేప ముక్క కలపక తప్పదు,

మాంసం లేకుండా పూర్తి అవ్వదు.



ఇదిగో తియ్యటి జెల్లీ,

కలిపామంటే భళీ, భళీ!



తగిన మోతాదులో కస్టర్డ్, గసగసాలు,

తప్పక కలపాలి సుగంధ ద్రవ్యాలు.

ఇవ్వన్నీ ఉంటే చాలు.

అమ్మ మెచ్చుకుంటుంది నా అద్భుత వంటకం

ఆ విషయంలో ఉంది నాకు పూర్తి నమ్మకం.




వంటల పుస్తకంలో ఉంది ఇలా,

దీనినంతటిని బాగా కలపాలి.

దీనిని కలపటం ఎలా –

అది నువ్వే తెలపాలి.



పాత్ర ఉండాలి కదలకుండా

కలపటానికి చీపిరి కావాలి.

అమ్మ ఉండాలి రాకుండా,

అంతా అయిన తరవాతే పిలవాలి.



“ఏం చేశావో ఇప్పుడైనా చెబుతావా?”

“అమ్మా! కొంచెం సేపు ఆగలేవా?

ఇంకాస్త ఓపిక పట్టు,

నేను చేసింది బాగోకపోతే ఒట్టు.

పూర్తయ్యాకే అర్థం చేసుకుంటావు

తిన్న తరవాత బాగుందని అంటావు.”





ఇక దీనిని బయటకి తియ్యాలి,

ముందు కొంచెం రుచి చూడాలి.

చూడటానికి కేక్ చాలా బాగుంది,

అమ్మకి తప్పకుండా నచ్చుతుంది.






చాక్లెట్‌తో మజా వస్తుంది,
పుట్టినరోజు కేక్ అని తెలుస్తుంది.



“బిల్లీ, ఇంకెంత సేపు ఉండమన్నావు,
ఎలాంటి కేక్ చేస్తున్నావు?”





"అంతా అయ్యాక నువ్వే చూస్తావు,

ఎంతో ఇష్టంగా తింటావు.

ఇంకా ఉంది కొంచెం పని,

చెప్పానుగా పిలిచినప్పుడే రావాలని."

అమ్మా!

లోపలికి రా!







"అద్భుతమైన కేక్ చేశావు బిల్లీ!
ఇలాంటి రోజు రాదు మళ్లీ, మళ్లీ!
నేను చాలా అదృష్టవంతురాలిని."



"దాచుకుంటాను ఈ కేక్ ఎల్లకాలం నేను
మళ్లీ నిన్ను ఇంత శ్రమపడనివ్వను!"

